వేంకటశేషకవి, అనుముల, 1905-

వెలయాలివేషాలు

నంద్యాల, 1928

Record no. 661

Vēṅkaṭaśēṣakavi, Anumula, 1905-

Velayālivēṣālu

Nandyāla, 1928

Record no. 661

## Bibliographic Record Target

వేంకటశేషకవి, అనుముల, 1905-

వెలయాలివేషాలు / అనుముల వేంకటశేషకవి విరచితము.- నంద్యాల : M.V. Seshaiah, 1928.

8 p. ;19 cm.

Record no. 661

Vēṅkaṭaśēṣakavi, Anumula, 1905-

Velayālivēṣālu / Anumula Vēṅkaṭaśēṣakavi viracitamu.- Nandyāla : M.V. Seshaiah, 1928.

8 p. ;19 cm.

Record no. 661

# వెలయాలి వేషాలు.

అనుముల వెంకటశేష కవిగారి

విరచితము.

PUBLISHED BY

M. V. SESHAIAH,

*Seshanarayana Book Depot,*

NANDYAL.

శ్రీబాల భారతీ పౌల్కం ముద్రణాలయమున ముద్రితము.

నంద్యాల.

1928.

కాపీరైటు ]

[ వెల. 0-2-0.

# వెలయాలి వేషాలు

అనుమాల. వేంకటశేష కవి

విరచితము

Published by
M. V. SESHAIAH.

శ్రీ బాల భారతీ జెల్‌కం ముద్రణాలయమున ముద్రితము.

నంద్యాల.

1928.

 [ వెల. 0-2-0

# వెలయాలి వేషాలు.



ఉ. "ఈతనొసంగి తాటిని గ్ర • హించు విధమ్మున" నెల్ల
వారలన్, బూతమెఱుంగు రంగులను • మోసము చేసి
మదిందనింపకే, కాతరమార్గవశ్యులను • గా నొనరించు
చుదుర్ధనమ్ముకై, పాతరలాడు భోగముల • భామలదూ
షణసేయుటొప్పదే. 1

చ. ఒకనికిముద్దు; కౌఁగిలి యిఁ • కొక్కనికిన్ అధరామృ
తంబు వే, రొకనికొసంగి యింతకును • నొక్కని కేనియుఁ
బొందుఁగూర్ప కే, సకలధనంబు లాగుకొని • చయ్యన
వేఱొక జారుఁగూడు పా, తక గణికావళిన్ జిదుకఁ •
దన్నిన నేనియు దోసమున్న దే? 2

సీ. 'ఇంటిపేరది కస్తూరి • యింతకరయ
గబ్బిలంబుల కంపు న • ల్గడల నింట'
ననెడిక్రియఁ బైపటారంబు • నరయ లోలో
టార షద్దిర! వేశ్యయా • నారిబ్రతుకు. 3

ఉ. పట్టుమటంచు నుక్కితెను • పావని యంటకు లేదు;
లంకలోఁ, బుట్టిన వారలెల్లరును • బోల్పఁగ రాక్షసు
లౌదు రేకదా? యిట్టిద వారిలక్షణ మి • హీ! ధనముం
డినఁజాలు నీచునేన్, దిట్టతనానఁ బొందెదరు! • దేవుని



నేని ధనమ్ములేనిచో నెట్టెదరావలన్; గనుక • నెమ్మది
నమ్మఁగరాదు వేశ్యలన్. 4

మ. చలచిత్తల్; దురితాత్మలెందునరయన్ • సాధారణస్త్రీలె,
వేశ్యల నింకన్ దడవంగ నేలనో? యవి • శ్వాసల్;
కుతంత్రాఢ్య చిత్తలు, దుర్మార్గప్రియల్; పయోముఖ
విషో • దంచన్మహా కుంభముల్, కలదే; వేశ్యకు
మించు దుర్వ్యసన మిం • కన్ ధాత్రి నెందేనియున్. 5

కమ్మని తేనె పూతఁగల • కత్తులు వేశ్యల వాక్యవైఖరుల్;
సొమ్ములరీతి సంకెలలు • సూ! వెలకాంతల నవ్వగల్;
చొక్కా, టమ్మగు నింటిదీపముల • టక్కులుపో గణికాళి
టెక్కు; లౌ, నమ్మక చెల్లి! యెందు వెల • యాండ్రను
నమ్మఁగరాదు చచ్చినన్. 6

ఉ. "మంత్రమొ? తంత్రమొ? మరులు • మందో? యొసంగి
ధనాంగనామణుల్, జంత్రపు బొమ్మలట్లు వరు • సన్
విటచిత్తములన్ గ్రహింతు" రం, చెంతురు వివేకహీను
లిహీ • హీ? విటకోటుల వారిమాటలే, తంత్రముఁ జేసి
లోఁగొని వి • త్తాళొనరింపవె? మందుమాకులై. 7

ఉ. గుడ్డకు దొడ్డముత్తమిడి • కొన్నను; తక్కువ సొమ్మ
టంచునున్, గొడ్డునుదీసికొన్నఁ; దన • కోరివరించిన
దైననేనియున్, మడ్డితనాన భోగముల • మానినికిన్

ధనమిచ్చిరన్ ; సరే!, యడ్డమె? యింకనున్ బయిసి
యారినదేకద యట్టివారికిన్. 8

క. తలఁగోసి ముందుఁ బెట్టినఁ
దలమే వేశ్యలకుఁ దృప్తిఁ ♦ దనరింపంగన్?
ఫలమేమి? తనరఁ జేసిన
బలవీర్యధనాది నాశ ♦ ఫలమే కాకన్. 9

సీ. ఎవరు కల్గంగ హైం ♦ దవ సుందరీసతీ
త్వము నేడుమంటలోఁ ♦ దగులఁబడియె;
నెవరుకారణముగా ♦ నెల్లరకు వ్యభిచా
రత మంచినీటి మ ♦ ర్యాదయయ్యె;
నెవరుజనింప హైం ♦ దవజాతిఁగని లాతి
జాతులు నవ్వ నా ♦ స్పదమొసంగె
నెవరుండ మధ్యపా ♦ నేత్యాదిఘోర పా
తకముల కిండియా ♦ తానమయ్యె
గీ. నెవరు వెలయంగఁ బ్రభువుల ♦ కేని నేడు
భోగపువృత్తిపై బుద్ధి ♦ పుట్టనయ్యె
నట్టిగణికల నింతకే ♦ మనఁగవచ్చు
గాలకూటవిషంబు వే ♦ శ్యాలయంబు. 10



సీ. బ్రాహ్మణవేశ్యలు ♦ రాజవేశ్యలు వైశ్య
వేశ్యలు విద్యార్థి ♦ వేశ్యలొకట
గాపువేశ్యలు పంట ♦ కాపువేశ్యలు వెల్మ
వేశ్యలు సుద్యోగ ♦ వేశ్యలొకటఁ
డాఫరువేశ్యలు ♦ కాఫరువేశ్యలు
విధవవేశ్యలు బాల ♦ వేశ్యలొకట
బరిణయవేశ్యలు ♦ తురకవేశ్యలు మధ్వ
వేశ్యలు ద్రావిడ ♦ వేశ్యలొకట
గీ. వీరు సరిస్త్రీలయందుండు ♦ వేశ్య; లింక
పురుషులనుగూడ వేశ్యలు ♦ పుట్టిరిపుడు
వేశ్యలకతంబునన్ జేసి ♦ వింత కాదె
కాలకూటవిషంబు వే ♦ శ్యాలయంబు. 11

సీ. లోపలికురుపుల ♦ రూపుమాపడకుండ
ప్లాస్త్రియుంటించి క ♦ ట్లనుబిగించి
జారియసహ్యంపు ♦ సరణినున్నట్టి చ
న్నులఁ బైకినెట్టి కం ♦ చెలఘటించి
చిప్పియౌ పెదపెద్ద ♦ దొప్పలక్రియనున్న
దౌడల సందున ♦ తమ్మనుంచి
యందవిహీనమై ♦ యలరారుమోమున
బూనికమై పూత ♦ పౌడినినించి
గీ. మించిపైవన్నె జూ ♦ పించుకొంటకు
కోర్కియున్న షుమార్లైన ♦ కోకఁగట్టి

మొలకనవ్వుల నెల్లర ♦ మోసగించు
కాలకూటవిషంబు వే ♦ శ్యాలయంబు. 12

సీ. సిగ్గింతయును లేక ♦ చేరిజారులవద్ద
మనసులఁ గరఁగించి ♦ మాయఁ జేసి
యధరామృతమ్మని ♦ యకదిసంతులుగొట్టి
వాహ్వారె యెన్నెన్నొ ♦ వగలుచూపి
ఉబ్బుసిబ్బెపుగబ్బి ♦ గుబ్బలంటఁగనిచ్చి
కౌఁగిలినీయక ♦ కసరికొట్టి
తుదకింత తమిరేచి ♦ వదలింపగా నీవి
సొలవుజూపించు ప ♦ ల్కులఁగరంచి

గీ. యింతలో దెల్లవార నె ♦ ల్లనిమెల్ల,
మెల్లఁగ జేతఁగల్గు సొ ♦ మ్మెల్లలాగి
యిడక సుఖమింతయును యిల్లు ♦ వెడలఁగొట్టు
కాలకూటవిషంబు వే ♦ శ్యాలయంబు. 13

సీ. హేయంపుబ్రదుకైన ♦ నేమిపోయనుకొన్న
ధనముచేఁ జేతనే ♦ తరలిపోవు
ధనముచేఁ జేతనే ♦ తరలనీయనుకొన్న
దేహబలంబనా ♦ దీనమగును
దేహబలంబనాధీన ♦ మేయనుకొన్న
సుఖముండదింతకు ♦ సుంతయైన
సుఖముండదింతకు ♦ సుంతేగాయనుకొన్న
రోగముల్ చుట్టును ♦ మూగికొనును



గీ. సతియుసుతులునుసం ♦ సార సంగతులును
నిహము పరమును జెడిపోవ ♦ నింతకయ్యె
కొయ్యయైనాశమగుఁ దుద ♦ కు నటుకానఁ
గాలకూట విషంబు వే ♦ శ్యాలయంబు. 14

గీ. "పూతమెఱుఁగును లోపలఁ ♦ బురు"గటంచు
లోకమెఱుఁగక పోదునీ ♦ లేకిబ్రతుకు;
సార! యెన్నాళ్లుటక్క ♦ టమారమెసఁగు?
ఛీ! వివేకినివగుమ వే ♦ శ్యావెలంది. 15

గీ. ఎన్నికొంపల నార్చిన ♦ నెంతధనము
నీవుగడియించినను గవ్వ ♦ నిలువఁబోదు?
యెవ్వరికిఁగాని బ్రతుకేల; ♦ యింకనైన
ఛీ! వివేకినివగుమ వే ♦ శ్యావెలంది. 16

గీ. వయసుచక్కఁదనంబున ♦ వరలునపుడె
యుండునేమున్నఁ; బయిగుక్క ♦ లొల్లఁబోవు
మూడునాళ్ల సుఖంబుకై ♦ మురియనేల?
ఛీ! వివేకినివగుమ వే ♦ శ్యావెలంది. 17

గీ. స్త్రీలకువిభూషణంబైన ♦ సిగ్గువిడచి
మానమభిమానమనుమాట ♦ నంటఁగలిపి
వసుధజీవచ్ఛవంబవై ♦ వరలనేల?
ఛీ! వివేకినివగుమ వే ♦ శ్యావెలంది. 18

గీ. వావివరుసలులేకుండ ♦ బ్రతికిపశువు
తెన్నునధరిత్రి నేమిసా ♦ ధింతువింత?
యన్నమాపున్నమా ♦ మదినెన్ని తేని?
ఛీ! వివేకినివగుమ వే ♦ శ్యావెలంది. 19

గీ. తిక్కపాటలునేర్చి ♦ తైతక్కలాడి
బూతులగ్రహించుటే మంచి ♦ నీతియంచు
మదిదలంచుచు నీచు ♦ లమఱుగుటవిడి
ఛీ! వివేకినివగుమ వే ♦ శ్యావెలంది. 20

గీ. ధనపిశాచికిదాసివై ♦ దయనువీడి
విటులపాలిటిదయ్యమై ♦ వెతలగుడుప
జననమందితివేనీవు? ♦ చాలుచాలు
ఛీ! వివేకినివగుమ వే ♦ శ్యావెలంది. 21

గీ. జేనెడగుపొట్టకై నీచు ♦ చెంతకేని
జేరుపాపిని,రండ, లం ♦ జయనుచంచు
దిట్టఁగానెల్లవారలు ♦ తెలివిలేదె
ఛీ! వివేకినివగుమ వే ♦ శ్యావెలంది. 22



# మాతావున దొరకు గ్రంథములు.

| | | రు. | అ. | పై. |
|---|---|---|---|---|
| సతీతార (శృంగారనాటకము) ఆ॥ వెంకటశేషకవీయం | | 1 | 0 | 0 |
| శ్రీయసుఖము (పద్యకావ్యము) | ,, | 0 | 4 | 0 |
| మహానందిమజా (శృంగారపద్యములు) | ,, | 0 | 1 | 0 |
| మహానందీశ్వర దండకము | ,, | 0 | 0 | 0 |
| వెలయాలి వేషాలు | ,, | 0 | 2 | 0 |
| నంద్యాల నైసు | ,, | 0 | 1 | 6 |
| మెట్టవేదాంతము | ,, | 0 | 1 | 6 |
| మహానందీశ్వర తారావళి | ,, | 0 | 1 | 0 |
| అహింస (ఏకాంతరూపము) | ,, | 0 | 2 | 0 |
| చౌడేశ్వరీ మాహాత్మ్యము (ప్రబంధము) | ,, | 1 | 0 | 0 |

## శతావధానులు రామకృష్ణసీతారామకవుల గ్రంథములు

| | రు. | అ. | పై. |
|---|---|---|---|
| సుబ్రహ్మణ్యేశ్వరీయము (ప్రబంధము) ... ... | 0 | 12 | 0 |
| రామ నిర్యాణము (నాటకము) ... ... | 0 | 12 | 0 |
| పెండ్లి పేరంటాండ్లు ... ... ... | 0 | 6 | 0 |
| బనగానిపల్లె దివాన్ చరిత్రము ... ... | 0 | 4 | 0 |
| అత్తవారింటి క్రొత్తల్లుడు ... ... ... | 0 | 4 | 0 |
| కలిచర్య (చాటుపద్యములు) ... ... | 0 | 2 | 0 |
| కవితారచన మ॥ వెంకటసుబ్బయ్యశాస్త్రిలవల్ల ... | 0 | 1 | 0 |
| కలియుగదర్పణము (నాటకం) క॥ జయరామరావువల్ల ... | 1 | 0 | 0 |

వలయువారు:—

**శేషనారాయణ బుక్ డిపో,**
నంద్యాల.

